**JEJI MAMAYYA PATALU**
*By Dr. Balantrapu Rajanikanta Rao*

First Edition :
**1964**

Second Edition :
**December 2006**

Published by :
**Nanduri Publications**
Hyderabad - 500 033.

Art work :
**Bapu**

Copies can be had from :
(In India)
**Nanduri Publications**
A-21, Journalist Colony, Jubilee Hills,
Hyderabad - 500 033. Ph : 040-23548352

Copies available also at :
Visalandhra Book House (All Branches)
Navodaya Book House, Hyderabad.
Navayuga Book House, Hyderabad.
Telugu Book House, Hyderabad.
Akshara, Hyderabad.

in U.S.A.
**Dr. Madhusarathi Nanduri**
Ph : (01) 732-274-2883
e-mail : madhu@nanduri.com

Price : **Rs. 50/-**
**6 $** (in USA & other countries)

# బాల సాహిత్యం

ప్రతి రోజూ, ప్రతి నిమిషం డబ్బింగ్ టీవీ ధారావాహికలు, డబ్బింగ్ సినిమాలు, డబ్బింగ్ వ్యాపార ప్రకటనలు, దినపత్రికలలోని వార్తా రచనలు వెదజల్లుతున్న భాషా కాలుష్యంతో తెలుగు భాష కృశించిపోతున్నది, పోలియో సోకినట్లు వంకర్లు, కొంకర్లు పోతున్నది. ఇంకొన్నాళ్ళకు అచ్చమైన తెలుగుపోయి కల్తీ తెగులే మిగిలేట్లు కనిపిస్తున్నది; తెలుగువాళ్ళంతా యింటాబైటా డబ్బింగ్ తెలుగే మాట్లాడతారేమోనని భయమేస్తున్నది.

ఎంత అందమైనది తెలుగు భాష! ఎంత తీయనైనది తెలుగు పలుకు! నేటి తెలుగు పిల్లలు కమ్మని తెలుగు మాట్లాడలేకపోతున్నారు. పిల్లలే కాదు-తల్లులూ మాట్లాడలేక పోతున్నారు. భాషా కాలుష్యం పట్టణాల నుంచి పల్లెల దాకా యింకుతోంది. పల్లె జనం కూడా యిప్పుడు కృత్రిమమైన పత్రికా భాష మాట్లాడుతున్నారు. తేనె తెలుగు పాటలు, తేట తెలుగు మాటలు అరుదైపోతున్నాయి; మరుగైపోతున్నాయి.

పిల్లలు తొలి పలుకులు నేర్చుకొనేది బడిలో కాదు-తల్లి ఒడిలో. అలా నేర్చుకొనేదే మాతృభాష. తల్లి భాష తల్లి పాల వంటిది. అందుకే తెలుగు తేనియను ముందు తెలుగు తల్లులు వంటిబట్టించు కొని తర్వాత పిల్లలకు పట్టించాలి. తెలుగుదనాన్ని ముందు తల్లులు అలవరచుకొని తర్వాత పిల్లలను తెలుగు బిడ్డలుగా తీర్చిదిద్దాలి.

నన్నయ నుంచి కందుకూరి దాకా యించుమించు తొమ్మిది వందల సంవత్సరాల తెలుగు సాహిత్య చరిత్రలో పౌరాణిక ఇతివృత్తాలతో ప్రౌఢ గ్రాంథికంలో రచించిన గ్రంథాలు తప్ప శిష్ట వ్యావహారికంలో సమకాలీన సామాజిక వస్తు సామగ్రితో రచించిన వేవీ కనిపించవు. పిల్లలకు ఉద్దేశించిన గ్రంథాలు మచ్చుకైనా కనిపించవు. ఐనా, నన్నయ కంటే ఎంతో ముందు నుంచీ - లిపి బద్ధంకాని, కేవలం సామాన్యప్రజల నాలుకలపైనే జీవించిన - గేయసాహిత్యం వుంది. ఆ

సాహిత్యంలో జానపదుల పాటలు, స్త్రీల పాటలు, పిల్లల పాటలు వున్నాయి. ప్రతి కాలంలోనూ గ్రాంథిక సాహిత్యంతో పాటు మౌఖిక సాహిత్యం కూడా వెలువడుతూ వచ్చింది. ఆ సాహిత్యంలో పోయినంత పోగా మిగిలి వున్న దానిని లిపి బద్ధం చేసే కృషి ఇరవయ్యో శతాబ్ది పూర్వార్థంలో జరిగింది.

వేటూరి ప్రభాకర శాస్త్రిగారు ఎన్నో ప్రాచీన గేయాలను, 'ఆట పాటల'ను సేకరించి 'బాలభాష' పేరుతో మొదట **1930** ప్రాంతంలో 'భారతి' పత్రికలో ప్రచురించారు. తర్వాత వాటిని పుస్తక రూపంలో తీసుకువచ్చారు. అంతకంటే ముందు వీరేశలింగం పంతులుగారు పిల్లల కోసం ప్రత్యేకంగా కథలు రచించారు, పాఠ్యపుస్తకాలు రచించారు. వేంకటపార్వతీశ కవులు పిల్లల కోసం పాటలు రాశారు. నాళం కృష్ణారావు గారు పిల్లల పుస్తకాలు రాశారు. గిడుగు సీతాపతి గారు 'భారతి' పత్రికలో 'బాలానందం' శీర్షికను ప్రారంభించి తాను స్వయంగా ఎన్నో రచనలు చేశారు. చింతా దీక్షితులు గారు రచించిన ఎన్నో పాటలు, కథలు 'భారతి'లోని 'బాలానందం'లో వచ్చాయి. ఆయన బాలగేయాల సంకలనం 'లక్కపిడతలు' పేరుతో వచ్చింది.

రేడియో అన్నయ్యగా, రేడియో అక్కయ్యగా ప్రసిద్ధులైన న్యాయపతి రాఘవరావు, న్యాయపతి కామేశ్వరి దంపతులు **1940**లో పిల్లల కోసం రేడియోలో ప్రత్యేక కార్యక్రమం ప్రారంభించడమే కాక **1945**లో 'బాల' పత్రికను కూడా నెలకొల్పారు. తెలుగులో మొదటి సమగ్ర బాల పత్రిక అదే. అప్పటి వరకు తెలుగులో వెలువడిన బాల సాహిత్యమంతా పిల్లల కోసం పెద్దలు రచించినదే. కాని, 'బాల' పత్రికలో పిల్లలు స్వయంగా రచించిన కథలు, పాటలు, బొమ్మలే ఎక్కువగా ప్రచురింప బడుతుండేవి. 'బాల' పత్రిక సుమారు పదిహేనేళ్ళు నడిచింది. **1946**లో అవతరించిన 'చందమామ' పత్రిక అనేక భాషలకు విస్తరించి యిప్పటికీ విజయవంతంగా నడుస్తున్నది. తర్వాత కాలంలో 'బాల', 'చందమామ' పత్రికల ధోరణిలో మరికొన్ని పత్రికలు వచ్చి కొద్ది కాలానికే మూతపడ్డాయి.

**1950-60** మధ్య కాలంలో ఆంధ్రపత్రిక వారపత్రిక బాల సాహిత్యానికి గొప్పసేవ చేసింది. నండూరి రామమోహనరావు గారు గేయరూపంలో రచించిన పంచతంత్రం కథలు, ఈసప్ కథలు (కథాగేయసుధానిధి), ఆంగ్లం నుంచి అనువదించిన మార్క్‌ట్వేన్ నవలలు-టామ్ సాయర్, హకల్ బెరీఫిన్, రాజూపేద మొదలైనవి – ఆ పత్రికలో వారం వారం ధారావాహికలుగా వెలువడి తెలుగు

బాలలను ముగ్ధులను చేశాయి. ముళ్ళపూడి వెంకటరమణగారి 'బుడుగు' కూడా ఆకాలంలోనే, ఆ పత్రికలోనే పుట్టాడు. బాలాంత్రపు రజనీకాంతరావు గారి జేజిమామయ్య పాటలూ సుమారుగా అప్పుడే వచ్చాయి.

1960 దశకం తర్వాత బాలసాహిత్య స్రవంతి క్రమక్రమంగా కృశించి సరస్వతీ నదిలా మరుగైపోయింది. ఇప్పటి మేధావులెవరికీ పిల్లల కోసం పుస్తకాలు రాసే తీరిక, ఓపిక, ఆసక్తి, శక్తి ఉన్నట్లు కనిపించడం లేదు. కొత్తగా రాసిన పాత కథలతో, ఖరీదైన ఆర్ట్ పేపర్ మీద రంగు రంగుల బొమ్మలతో మెరిసిపోయే పిల్లల పుస్తకాలు కుప్పలు కుప్పలుగా బజారులో దొరుకుతున్నాయి. కాని, వాటిలో సాహిత్యపు విలువలు మృగ్యం. బాల సాహిత్యానికి సంబంధించినంతవరకు యిప్పుడు మనకు మిగిలినదల్లా తాతాలనాటి సంపదే. కనీసం దాన్నైనా మనం కాపాడుకోవాలి. పాతరలు తవ్వి పాత రచనలను వెలికి తీయాలి. ఆ తరం సాహిత్యాన్ని ఈ తరం తెలుగు బాలలకు అందించడం ద్వారా రూపు మాసిపోతున్న తెలుగుదనానికి పూర్వ వైభవం తీసుకురావాలి.

ఈ ఉద్దేశంతోనే నండూరి పబ్లికేషన్స్ సంస్థ నలభై, యాభైయేళ్ళనాటి, యింకా వెనకటి కొన్ని అపురూప బాలసాహిత్య గ్రంథాలను పునర్ముద్రించాలని సంకల్పించింది. మొదటి విడతగా నండూరి రామమోహనరావు గారి 'హరివిల్లు', 'కథాగేయసుధానిధి' అనే రెండు పుస్తకాలను అందించింది. వాటి రచనాకాలం 1950వ దశకం. ఇప్పుడు మరో రెండు పుస్తకాలు – నండూరి రామమోహనరావు గారి 'బాలరాజు', రజనీకాంతరావు గారి 'జేజిమామయ్య పాటలు' – అందిస్తున్నది. ఈ రెండింటినీ 1961లో ఎం. శేషాచలం కంపెనీవారు తొలిసారిగా ప్రచురించారు. బాపు గారి చిత్రాల నిరుపమాన సౌందర్యం ఈ పుస్తకాలకు ప్రత్యేక ఆకర్షణ. తెలుగును కాపాడుకోవాలన్న శ్రద్ధాసక్తులుగల పెద్దలంతా ఈ పుస్తకాలను కొని చదివి, వీటి తీయందనాలను తమ పిల్లలకు గోరు ముద్దలుగా అందించాలని మా ఆకాంక్ష. పిల్లలే కదా మన పెన్నిధి.

**– నండూరి పార్థసారథి**
పబ్లిషర్

హైదరాబాద్
డిసెంబర్ 2006.

# జేజి మావయ్య పాటలు

## (రజనీ) మావయ్య ముందు మాట

ఆకాశవాణి మద్రాసు కేంద్రంలో 1942 జూలై 1వ తేదీన నిలయకళాకారుడుగా చేరాను.

ఇంగ్లీషు పిల్లల ఆదివార కార్యక్రమాన్ని హేండెల్ మేన్యుయెల్ అనే నిలయ కళాకారుడు రేడియో అన్నయ్యగా నిర్వహిస్తూండేవాడు. తెలుగు పిల్లల కార్యక్రమాలలో ఒక ఆదివారం దుర్గాబాయి గారి చెన్నపురి ఆంధ్రసభ-బృందావన బాలబాలికా బృందం, మరొక వారం న్యాయపతి రాఘవరావు గారి రాయపేట బాలబాలికా బృందమూ పాల్గొంటూండేవి.

ఇంగ్లీషు పిల్లల కార్యక్రమానికి 'టెడ్డీబేర్స్ పిక్నిక్' అనే ఇంగ్లీషు ఆర్కెస్ట్రా రికార్డు సిగ్నేచర్ ట్యూన్ గాను, ఆ వరసలో ఇంగ్లీషు పాట ప్రసారం అవుతూండేవి.

అదే వరసలో -

"రారెచిన్ని పిల్ల లారా
రారె చిట్టి తల్లులార
ఆట పాట లెన్నొ కూడి
ఆడి పాడుదాముగా" -

అనే తెలుగుపాట జేజిమావయ్య పాటగా నేడు రచించాను. ఆ పాటలో

"దాచుకోండి పుస్తకాల్
పాఠములికచాలు చాల్
చేయి చేయి కలిపి చెంగు
చెంగున పరిగెత్తిరారె" -

ఇది (నాదే) రెండో స్టాంజా కాగా,

"ఆదివారమిదుగో వచ్చె
ఆనంద మెంతో హెచ్చె
రేడియో యెదుట కూడి
వేడుకలే వినగదే" -

అనే స్టాంజా 3వదిగా రేడియో అన్నయ్య రాఘవరావుగారు చేర్చారు. దాంతో ఆదివారపు పిల్లల 'కోగ్రాం' (ప్రోగ్రాం) రేడియో పాట తయారయ్యింది. మహిళా కార్యక్రమాలకు యస్.కె. కన్నమ్మాళ్ ఇన్‌ఛార్జిగా ఉండేది. ఆవిడకి నేను సహాయకుడిని. ఆవిడ తన స్త్రీల కార్యక్రమంలో 'మీ పాపకొక పాట' అని చెప్పి నాచేత పాటలు రాయించి, మహిళామండలి కార్యక్రమంలో పాడించేది. వాటికి నేనే మైక్ ముందు పాడుతూ తల్లుల్నీ పిల్లల్నీ నేర్చుకోమని చెప్పేవాడిని. వాటిలోవే -

"కాకీ కాకీ హాష్
కాకీ కాకీ రావే రావే
పాపాయి బువ్వ తింటోందే"

- అనే పాట

"దోబూచీ దోబూచీ
కళ్లూ రెండూ మూచేచీ
చీచీచీ, చీచీచీ
చీచీ అంటే చిగ్గేచీ
అమ్మకొంగులో దాచేచి"

- ఇలా ఒక పాట

"ఆటలు ఆడీ పాటలు పాడీ అలిసీవచ్చానే
తియ్యా తియ్యటి తాయిలమేదో
తీసిపెట్టమ్మా"

- ఇలా ఒక పాట

"సిపాయి యెక్కేది యెర్రా గుఱ్ఱం, మా
పాపాయి యెక్కేది కఱ్ఱా గుఱ్ఱం"

- అనే పాటా, ఇలా తయారయాయి.

ఒకసారి, వానలకి, రేడియో స్టేషన్‌లో నా (స్టేషన్ డైరెక్టర్) గది ఉండే ప్రాంతం అంతా "చెరువైపోయి దానిలో కప్పలు కోరస్ పాడుతున్నాయి. వెంటనే ఇంజనీరింగ్ సెక్షన్‌కి ఫోన్ చేసి, రికార్డర్‌తో ఒక యువ ఇంజనీర్‌ను రమ్మని ఫోన్ చేశాను. మడుగు మధ్యకి చంకని రికార్డర్‌తో వెళ్లి కప్పల ఆర్కెస్ట్రా మోగుతుండగా రికార్డ్ చేయించాను. దీనికి పాట రాశాను.

"కరరవ రట్, మరరవ రట్
గడబిడ చేస్తోంది కప్ప -

నడుమ నున్న పెద్ద కప్ప
బడిపంతులుగారేమో
వద వద మను చిరుకప్పలు
చదివే బడి పిల్లలేమొ
చెరువే ఒక బడియేమో
చెపుతున్నది పాఠమేమో
కరరవ రట్ మరరవ రట్
గడబిడ చేస్తోంది కప్ప"

మరోసారి - ఏక్షన్ చేస్తూ పిల్లవాడు పాడేపాట.

"నాన్న కోటు వెనకా,
నక్కీ కూచుంటా
అమ్మా వెతుక్కోమంటాను
అమ్మ వెతకలేకా, అటూయిటూ చూస్తే
కాళ్లాగజ్జెల్లు ఘల్లుఘల్లు మనిపిస్తా
కొద్దిగా వంగి కనిపిస్తా..."

— జేజిమామయ్య పాటలు

వీటిని ఒక పుస్తకంగా 'బాపు' (అప్పటికి పిల్లల'కోట్రాం'లో హీరో-స్థాయి నుంచి యెదిగి పెద్దవాడయినాడు). బాపు బొమ్మలతో-1964లో ఎమ్. శేషాచలం గారు శేషాచలం కంపెనీ తరపున పాట పాటకీ పుట పుటకీ బొమ్మలతో అచ్చువేశారు.

ఈ పాటల్ని నా రెండో యేట చనిపోయి 'చుక్కల్లో చేరిన' మా అమ్మ గారికి అంకితం ఇచ్చాను.

ఇప్పుడు రసమయి పార్థసారథి మామయ్య గారు ఈ పుస్తకాన్ని మరిన్ని పాటలు చేర్చి (నావే) అచ్చు వేస్తున్నారు వారికి నా కృతజ్ఞతలు. ఇప్పటి ఆకాశవాణి అసిస్టెంట్ స్టేషన్ డైరెక్టర్ ముంజులూరి కృష్ణకుమారి ఎనభైలలో-విశాఖలో పనిచేస్తున్నపుడు 10, 12 పాటలని రికార్డ్ చేసింది -రేడియో కేంద్రం కోసమే!-విజయవాడ రేడియో పాటల్ని వికాసవిద్యాలయం కూడా విజయవాడలో రికార్డు చేశారు. టేప్ క్యాసెట్ రిలీజ్ చేశారు కూడాను.

## పాటల వరస

## కొత్త పాటలు

# అంకితం

– చుక్కల్లో ఉన్న అమ్మకి –

ఇక్కడ నీ పాపల మము విడిచి
చుక్కలలో చేరిన మా అమ్మా
అక్కడనుండే మా నడతలను
చక్కగ కనిపెడుతున్నావా....

పాపం పుణ్యం, సుఖము దుఃఖమూ
పగలూ రాత్రీ కల లోకంలో
దొరకనిదానికి చేతులు చాస్తూ
పరుగులు పెడుతూ పెరుగుతువున్నాం....

నీ ముద్దులు నీ మురిపాలేవో
నీ కలలేవో, దీవన లేవో
తెలిసిన నాన్నకి తీరిన ధోరణి
పరచిన తోవను పెరుగుతు వున్నాం....

విన్నావో, మా మాటలు పాటలు
కన్నావో, మా విద్యలు కళలూ
నీ లేగొమ్మల పూచిన పూవులు
పూలగుత్తిలో పొడమిన పిందెలు....

నీ మనుమలు మా ఆశల మొలకలు
తాము కోరి పాడించిన పాటలు
అంకిత మిస్తా ఇదె చేకొమ్మా
చుక్కలలో చేరిన మా అమ్మా....






కాకీ, కాకీ, హోష్
కాకీ, కాకీ, రాకే, రాకే,
పాపాయి బువ్వ తింటోందే
కాకీ, కాకీ, హోష్....

వెండి గిన్నెలో పప్పూ బువ్వా
గుంజు గుంజు గుంజు గుంజు
గోరు, గోరు, గోరు, గోరు....

కంచం అంచున రాసీ,
గోరూ గుజ్జూ తీసీ
గుజ్జూ నోటికి పూసీ
బుజ్జీనోటా అం.....

అత్తా ముద్దా ఆ ఆ ఆ
ఆ ఆ ఆ - అం
అమ్మా ముద్దా ఆ ఆ ఆ
ఆ ఆ ఆ - అం

నాన్నా ముద్దా ఆ ఆ ఆ
ఆ ఆ ఆ - అం
కాకీ, కాకీ, రావే, రావే,
బుజ్జీ ముద్దా తిని పోవే...



# నవంబరు పదునాల్గు



బాలలపండుగ నేడె, నవంబర్
పదునాల్గుకు జేజేలు!
నెహ్రూ చాచా! నీ జన్మదినం
నీ కివె మా జేజేలు!! ||బాలల||

ఒక్కొక ఏటికి ఒక్కొక్క పావుర
మెగురు మింట శాంతి పతాక!
నూరుపావురాల్ మించుదాక నీ
జన్మదినము వచ్చునుగాక!! ||బాలల||

నీ గుండెలపై కోటు బొత్తమున
నిలిపిన గులాబి వలపు లవే!
నిఖిల దేశముల బాలల మైత్రికి
నీయెద తియ్యని తలపులవే!! ||బాలల||

నీ చేతులలో బెత్తము జగతికి
నిత్యము కొలిపెడి ఆవేశం
సమతా, స్వతంత్రతా, నిర్భయతా,
సహజీవనముల సందేశం!! ||బాలల||

హద్దులేని ఆనంద తరంగపు
టంచుల తేలుచు ఆటలలో
నేటి బాలుడే రేపటి పౌరుడు
నెహ్రూ చాచా సమానుడౌ!! ||బాలల||





# దోబూచి

దోబూచి, దోబూచి
కళ్లూ రెండూ మూచేచి,
అమ్మకొంగులో దాచేచి
దోబూచి, దోబూచి

నాన్నా ఏడీ పాపాయి
కన్నా దేడీ కన్నాడు
బూచాడు బూచాడు
బూడాడంటే బయమేచి
కళ్లకి గంతా తీచేచి....

చీ చీ చీ, చీ చీ చీ
చీ చీ అంటే చిగ్గేచి,
పక పక పక పక నవ్వేచి
దోబూచి దోబూచి



# పాపాయి నవ్వు

కిల కిల కిల కిల
కిలకిల లాడే పాపాయి నవ్వులూ
తళ తళ తళ తళ
తళతళ లాడే రత్నాల రవ్వలూ
సిగ్గుల పాపాయి
చిన్నీ బుగ్గల్లూ
చిన్నారి తామర
చిట్టీ మొగ్గల్లూ....
పాపాయి మెడలో
ముత్యాల దండా
పాపాయి మొలలో
మొహిరీల పేరూ....
గల గల గల గల
గలగలలాడే గజ్జెల్ల మువ్వలూ
కల కల కల కల
కలకలలాడే బంగారు పువ్వులూ....

# ఎల్లాగొచ్చావు



ఎల్లాగొచ్చావురా తమ్ముా
నిన్నెవ రిచ్చారురా అమ్మకి... ||ఎల్లా||
అమ్మా జేజికి దణ్ణం పెడితే
అమ్మకి జేజి నిన్నిచ్చిందా
ఆసుపత్రిలో మంతరసానీ
అందుకొనీ అమ్మకు ఇచ్చిందా... ||ఎల్లా||
బొట్టు పెట్టెలో బంగరు పాపను
పెట్టీ అమ్మకు ఎవరిచ్చారో
బోసీ నవ్వుల బుజ్జీపాపను
చూసీ అంతా మురిసేవారే... ||ఎల్లా||
చేతులు మా తాత పోలికట,
మూతీ మా నాన్న పోలికట,
ముక్కూ మా అవ్వ పోలికట,
కళ్లూ మా అమ్మ పోలికట.... ||ఎల్లా||
ఎల్లా గొచ్చావురా తమ్ముా
నిన్నె వరిచ్చారురా అమ్మకి...



# చల్ చల్ గుర్రం

చల్ చల్ చల్ చల్
చల్ చల్ గుర్రం
హాల్ హాల్ హాల్ హాల్
హాల్ హాల్ గుర్రం....

తాతా బొజ్జా గుర్రం ఐతే
మంచీ కథలూ చెపుతాడు,
మామా బుజమే గుర్రం ఐతే
మంచీ పెళ్లీ చేస్తాడు....

ఊరులు పల్లెలు దేశాల్ చూస్తా
అమ్మకి మంచీ చీరలు తెస్తా
తాతకి చక్కని శాలువ కొంటా
మామకి అంచుల పంచెలు కొంటా...

నాన్నకి మంచీ చేతీ కర్రా
చెప్పులజోడూ తెచ్చీ ఇస్తా
చల్ చల్ చల్ చల్
చల్ చల్ గుర్రం
హాల్ హాల్ హాల్ హాల్
హాల్ హాల్ గుర్రం....

# బురుకూ బురికీలు



బురుకూ బురికీలు, ఓహో
ఎక్కడ దొరికీలు!
ముద్దూ పెట్టే వారికి చిట్టీ
బరుకూ బరికీలు!! ||బురుకూ||

ఉక్కా ఉంగీలు-నోటా
ఊరూ చొంగల్లు!
ఎక్కడి కక్కడె ఉరకలు వేసీ
చెంగూ చెంగీలు!! ||బురుకూ||

గుప్పీ గుప్పిళ్లూ, మూసీ
విప్పీ దొప్పల్లూ!
ఎప్పటికప్పుడె వత్తులు వత్తీ
లడ్డూ బరిఫీలు!! ||బురుకూ||

చుబుకూ చుబుకీలు-ఓహో
గబుకూ గబుకీలు!
కుడిచీ కుడిచే వేళ్లూ ఊడీ
ఉలుకూ ఉలుకీలు!! ||బురుకూ||

చిట్టీ తమ్ముాలు-ఓహో
చిన్నా పాపల్లూ!
చీ చీ అంటే తెరలూ తెరలూ
బోచీ నవ్వుల్లూ!! ||బురుకూ||





# దొంగ పిల్లి

మ్యావు మ్యావు పిల్లీ
రావె రావె పిల్లీ
ఈ బువ్వ కాస్త తినిపోవే

గోరు వెచ్చపాలూ
గుజ్జు వెన్నపూసా
బొజ్జనిండా నింపుకొని పోవే....

మ్యావు మ్యావు పిల్లీ
రావె రావె పిల్లీ
ఈ బువ్వ కాస్త తినిపోవే

హాసి దొంగ పిల్లీ
మీసాలపైనీ
పాల చుక్క లెందుకొచ్చాయే....

పాలగిన్నీ మీదీ
పళ్లేన్నీ కిందా
పడగొట్టి మూల చేరావా

మ్యావు మ్యావు పిల్లీ
పోవే పోవే పిల్లీ
ఈ బువ్వ నీకు కాదు లేవే...





# భోగిపళ్లు

చిట్టీ చిట్టీ రేగీపళ్లూ
చిట్టీతలపై భోగీపళ్లూ
ఎంతో చక్కని భోగీపళ్లూ...
ఎర్రా ఎర్రని రేగీపళ్లూ...

ఘల్లూ ఘల్లున దమ్మిడీలు
జల్లుగ అల్లో నేరెడి పళ్ళూ
తళ తళ తళ తళ లాడీపోతూ
తలపై ఎన్నో దొర్లీపోతయ్...

పెద్దల దీవన లెన్నో పూలై
ముద్దులు తియ్యాతియ్యని పళ్లై
తళతళ తళతళ లాడీపోతూ
తలపై ఎన్నో దొర్లీపోతయ్...

పసుపూ గందం అరిటి పళ్లతో
మిసమిసలాడే పట్టుచీర్లతో
ముత్తైదువులా గాజుల సడిలో
ఎత్తున రాలే భోగీ పళ్ళూ....

చిట్టీ చిట్టీ రేగీపళ్ళూ
చిట్టీ తలపై భోగీపళ్ళూ...





# కర్ర గుర్రం

సిపాయి ఎక్కేదీ యెర్రాగుర్రం
మా పాపాయి ఎక్కేదీ కర్రాగుర్రం

పారీపోతుందీ సిపాయీ గుర్రం, ఓహో
కట్టీ పడుంటుందీ కర్రాగుర్రం...
ఊళ్ళన్నీ వెళ్తూ సిపాయీ గుర్రం,
మరి, ఉయ్యాలలూగూ పాపాయీ గుర్రం

గోలేలతో నీళ్లు గరికాలూ గుగ్గిళ్ళూ
చాలా కోరేదీ సిపాయీ గుర్రం
గుగ్గిళ్ళూ అడగాదు, గరికావో చదుగాదు
నీళ్లయినా అడగాదు కర్రాగుర్రం...

ఒకసారీ ఎక్కేసీ ఊరేగీ రాగానే
ఉస్సూరంటుందీ సిపాయీ గుర్రం,
ఎన్ని సార్లెక్కినా ఎంత సేపూగినా
ఏమీ అలిసీపోదూ కర్రాగుర్రం....

సిపాయీ ఎక్కేదీ యెర్రాగుర్రం
మా పాపాయి ఎక్కేదీ కర్రాగుర్రం....



# అమ్మా వెతుక్కో



నాన్న కోటువెనకా
నక్కీ కూచుంటా
అమ్మా - వెతుక్కోమంటాను

అమ్మ వెతకలేకా
అటూ ఇటూ చూస్తే
కాళ్ళా గజ్జెలు ఘల్లు
ఘల్లు మనిపిస్తా
కొద్దిగా వంగి కనిపిస్తాను

అమ్మ నన్ను చూసీ
పట్టుకో వస్తే
అందకుండ పారిపోతాను

ఇంద ఇంద పాపా
ఇంద తాయ మంటూ
అమ్మ నావెంట వస్తుంది
అమ్మ చేతిలోనీ
తాయాన్ని చూసీ
అట్టట్టె దొరికిపోతాను....



# తాయిలం



ఆటలు ఆడీ పాటలు పాడీ అలసీవచ్చానే
తియ్యా తియ్యని తాయిల మేదో తీసీ పెట్టమ్మా...

పిల్లీ పిల్లా కళ్ళూ మూసీ పీటా ఎక్కిందీ
కుక్కా పిల్లా తోకాడిస్తూ గుమ్మామెక్కిందీ
కడుపులోనీ కాకీ పిల్లా గంతూలేస్తోందీ
తియ్యాతియ్యని తాయిలమేదో తీసీ పెట్టమ్మా...

గూటీలోనీ బెల్లం ముక్కా కొంచెం పెట్టమ్మా..
చేటాలోనీ కొబ్బరి కోరూ చేరెడు తియ్యమ్మా
అటకా మీదీ అటుకుల కుండా అమ్మా దింపమ్మా
తియ్యా తియ్యని తాయిలమేదో తీసీ పెట్టమ్మా...




బుడగల్లూ బుడగల్లూ, చిట్టీ చిట్టీ బుడగల్లూ
సబ్బూనీటీ బుడగల్లూ, బుడగల్లూ బుడగల్లూ...

పొంగులువారే బుడగల్లూ, బుస్-బుస్
బూరా వూదే పెదవుల్లూ, ఉఫ్ ఉఫ్

సబ్బూనీటీ బొబ్బల్లో, బుడ బుడ బుడ బుడ మంటూను
తేలీపోయే పడవల్లూ, బుడగల్లూ బుడగల్లూ...

పొంగులువారే బుడగల్లూ, బుస్-బుస్
బూరా వూదే పెదవుల్లూ, ఉఫ్ ఉఫ్

సబ్బూ నీటీ బొబ్బల్లో, తళ తళ తళ తళ మంటూను
ఎగిరే గాలి విమానాలూ, బుడగల్లూ బుడగల్లూ...




పిచికమ్మ ఓ పిచికమ్మా
కిచ కిచ మంటూ ఏమీ కథలూ
చెపుతావో, మరి చెప్పమ్మా.... ....

కొమ్మ మీద కనిపిస్తావే
కమ్మ కమ్మగా కూస్తావే
కిటికీపైనీ వాలీ చెవిలో
కిచ కిచమంటూ ఏమీ కథలూ
చెపుతావో, మరి చెప్పమ్మా.... ....

పిచికమ్మా, ఓ పిచికమ్మా
అమ్మా బియ్యం ఏరుతువుంటే
నమ్మాకంగా పక్కన చేరీ
ముక్కున గింజా కరుచూకోనీ
చటుక్కునా నువ్వెగిరీ పోతావ్.... ....

కిచ కిచమంటూ ఏమీ కథలూ
చెపుతావో మరి చెప్పమ్మా...
పిచికమ్మా ఓ పిచికమ్మా.... ....






చక చకా పోతోంది మూడు చక్రాల సైకిల్

ముందు చెల్లినీ కూచోపెట్టీ
వెనక అక్కనీ కూచో పెట్టీ
నడుమ ఠీవిగా తాను కూచొనీ

జడుపూ గిడుపూ లేని బాబూ
షోకుగా ఒకసారి వంగీ
ఠీకుగా తలయెత్తి తొక్కగా

చక చకా పోతోంది మూడుచక్రాల సైకిల్

పక పకా నవ్వింది అక్కా
కిలకిలా నవ్వింది చెల్లీ
నడుము వంపులు తిప్పుకొంటూ
వడి వడి వడిగ ఒకసారి మెల్లని నడకతో ఒకసారి త్రొక్కగా
చక చకా పోతోంది మూడు చక్రాల సైకిల్

సందు అంతా రాకపోకల సందడెక్కిన రాచబాట
ముందువున్నా చెట్టుచేమా వెళ్లిపోదం వెనక్కేట
కొండమీదీ జేజిమామయ కూడ పరుగున తోడురాగా...
చక చకా పోతోంది మూడు చక్రాల సైకిల్





# పాలపిట్ట

పాలపిట్ట రావే
పలుకాడి పోవే....

చిన్ని రెక్క చేతులు పరచీ
సన్న యెలుగులో మైమరచీ
ఆకసాన తేలీపోతూ
అల్ల నల్ల యెగిరీ రావే....

పాలపిట్ట రావే
పలుకాడి పోవే....

తంతి తీగపైనా నిలిచీ
వింత లేమి చెప్పుతావే
రైలుబండి గూటీలోనా
వాలీ నేను చూచూచుండా

పాలపిట్ట రావే
పలుకాడి పోవే...

చిన్ని తోక కదిలీ ఆడా
చిన్ని గొంతు పాటా పాడా
పాట పైకి రాకామునుపే
దాటు వేసి యెగురూతావే...

పాలపిట్ట రావే
పలుకాడి పోవే....






బురు బురు పం పాం
బురు బురు పం పాం
బుర్రూ బుర్రూ పాం పాం....

డ్రైవర్ సీట్లో కూర్చుం దెవరూ
స్టీరింగ్ చక్రం తిప్పేదెవరూ
యాక్సిల్ చెక్కలు తొక్కేదెవరూ
ఇంకెవ రెవరూ మా పాపే....

బురు బురు పం పాం
బురు బురు పం పాం
బుర్రూ బుర్రూ పాం పాం....

ఏటిఒడ్డునా తోటల లోనా
బీచిఒడ్డునా బాటలపైనా
కారు షికారూ పోయే దెవరూ
ఇంకెవ రెవరూ మా పాపే....

బురు బురు పం పాం
బురు బురు పం పాం...
బుర్రూ బుర్రూ పాం పాం....

పల్లపు దారిని చల్లగ జారీ
మెట్టదారినీ బెట్టుగ ఎక్కీ
చదునుదారినీ సాగేదెవరూ
ఇంకెవ రెవరూ మా పాపే....

బురు బురు పం పాం
బురు బురు పం పాం
బుర్రూ బుర్రూ పాం పాం....



# కప్పల బడి

కరరవ రట్ మరరవ రట్
గడబిడ చేస్తోంది కప్ప....

గొంతుకలో జంతికలా
గుబ గుబమని ఆడంగా
రబ్బరు బుడగలా పొట్ట
ఉబ్బి ఉబ్బి సన్నగిల్ల
మోరచాచి దేవుడితో
మొరపెడుతోం దేమేమని....

కరరవ రట్ మరరవ రట్
గడబిడ చేస్తోంది కప్ప....

మడుగుల్లో, బావుల్లో,
దొరువుల్లో, చెరువుల్లో
నీళ్లుచేరి పొర్లిపారి

కళ్ళాలన్నీ నిండగ
సర సర సర వానజల్లు
కురు కురుమని మొరపెడుతూ....

కరరవ రట్ మరరవ రట్
గడబిడ చేస్తోంది కప్ప...

బడిమానిన ఆకతాయి
దడ దడమని గొడవ చేసి
చిట్టి చిట్టి రాళ్ల తీసి
చెదరగొట్ట చూడగాను
జీవహింస చేయు నిన్ను
దేవుడు శిక్షిస్తాడని...

కరరవ రట్ మరరవ రట్
గడబిడ చేస్తోంది కప్ప...

నడుమనున్న పెద్ద కప్ప
బడిపంతులు గారేమో
వద వద మను చిరుకప్పలు
చదివే బడి పిల్లలేమొ,
చెరువే ఒక బడియేమో
చెపుతున్నది పాఠమేమో...

కరరవ రట్ మరరవ రట్
గడబిడ చేస్తోంది కప్ప



# చందమామ బోటు

చందమామ బోటులో
అందమౌ మిన్నేటిలో
చల్లగాలి షికారుపోవుద
మా - వెన్నెలరేయి....

తీయ పాటలు పాడుతూ
హాయి నోల లాడుతూ
దివ్యలోకాల్ దాటిపోవుద
మా - వెన్నెల రేయి...

పూలతావుల సోలుతూ
తూలు తేనెలు క్రోలుతూ
తేలుతూ షికారుపోవుద
మా - వెన్నెలరేయి....

చందమామ బోటులో
అందమౌ మిన్నేటిలో
చల్లగాలి షికారుపోవుద
మా - వెన్నెలరేయి....



# వానా వానా చెల్లప్పా

వానా వానా చెల్లప్పా - వాకలి తిరిగే చెల్లప్పా
ఎండా వేసిన వస్తువులన్నీ - ఇంట్లో పెట్టూ చెల్లప్పా....

గాలీ గాలీ చెల్లప్పా - గబగబ రావే చెల్లప్పా
చిట్టూ తవుడూ ఎత్తీపోసీ - కొట్టున పెట్టూ చెల్లప్పా!

ఉరుములు మెరుపులు చెల్లప్పా - ఉరుకుతు రావే చెల్లప్పా
బెదురుతు వుండే పాడీ పశువుల - పాకను కట్టూ చెల్లప్పా....

వానా వానా చెల్లప్పా - వాకలి తిరిగే చెల్లప్పా
తడిబట్టలనూ ఆరావేసీ - పొడి బట్టలుతే చెల్లప్పా....




కోతీ కోతీ నా ముక్కు దురదా
నీ చేష్టలంటే నాకెంత సరదా...
పొట్టమీది పేలు చూస్తూ, తీస్తూ
నోట్లో పడేస్తావు, అది ఏం సరదా....

చెట్టు చెట్టూ దూకి కొమ్మలెగబాకి
గుడి గోపురా లెక్కి గోడల్లు దాటి
చెంగు చెంగున ఎగురు నీ మెడను అంటి
వ్రేలాడు నీ పిల్ల నా కెంతసరదా....

బాబు చేతుల్లోని జామిపండేది
నాది నాదీ అంటు దాచుకొంటున్నా
చేతిలోనిది లాగి చప్పున గెంతి
గోడెక్కి తిమ్మన్న కొరుక్కుంటోంది...

నాన్న యిచ్చిన పండు నా చేతిపండు
లాగికొన్నా పండు ఆగకే తింటూ
తననోటిలో వున్న దవడసంచులలో
దాచుకొని తిమ్మన్న నెమరువేస్తోంది....





# కాగితపు పడవ

సాగుతోందిరా పడవ సాగుతోందిరా
కాగితంపు చిన్ని పడవ సాగుతోందిరా....

చిట్టిచెల్లి, నేను కలసి కట్టుకున్న చిన్నిపడవ
తెరచాపా, చుక్కానూ తెడ్డు లేక తొరతొరగా....

ధారలుగా కురియును వాన
ఏరులుగా దారిలోన
తారి తారి, వూరి వూరి,
చేరి పారు కాల్వలోన....

సాగుతోందిరా పడవ సాగుతోందిరా
కాగితంపు చిన్ని పడవ సాగుతోందిరా...

సుడులలో తడబడీ
జడులలో వడి వడీ
బడలకే వయారమైన
నడలతోడ పరువిడీ....

సాగుతోందిరా పడవ సాగుతోందిరా
కాగితంపు చిన్నిపడవ సాగుతోందిరా....





# బొంగరం

చుట్టూ చుట్టిన తాడు వీడి
కట్టువదిలిన కోడెలాగా
చెంగుమంటూ చేయిజారీ
రింగుమంటూ నేలవ్రాలీ

గిర గిర గిర గిర తిరిగిపోతూ
చర చర చర చర జరిగిపోతూ
వ్రాసే దేమే నేలమీద,
గీసేదేమే బొంగరమ....

నిట్టనిలువున కదలకుండా
నిబ్బరంగా కొంతసేపూ
అట్టూ ఇట్టూ ఆడిపోతూ
ఆదరా బాదరా కొంతసేపూ

అల్లా గల్లా ఊగిపోతూ
వెల్లకిల్లా దొర్లిపోతూ
వ్రాసేదేమే నేలమీద,
గీసేదేమే బొంగరమ....

ఎప్పుడు బడికీ పోయినావే
ఏమి పుస్తకాల్ చదివినావే
ఎల్లావచ్చిందింత చదువూ
ఏమో చెప్పవె బొంగరమ....





# పాము పాట

దెద్దే దెద్దే నాగన్నా,
ధిత్తై ధిత్తై నాగన్నా
వద్దూ కోపం నాగన్నా,
సుద్దులువినరా నాగన్నా

నాగసారంపై నాగన్నా
రాగం వినరా నాగన్నా
రాగం వింటూ నాగన్నా
ఊగుతు ఆడర నాగన్నా ||దెద్దే||

బుస్సూమనకూ నాగన్నా
కస్సూమనకూ నాగన్నా
పాటా వింటూ నాగన్నా
ఆటా ఆడర నాగన్నా ||దెద్దే||

తలలో నాల్కలు నాగన్నా
తళ తళ లాడగ నాగన్నా
పడగా విప్పూ నాగన్నా
పక్కలకూగూ నాగన్నా....

దెద్దే దెద్దే నాగన్నా!
ధిత్తై ధిత్తై నాగన్నా
వద్దూ కోపం నాగన్నా!
సుద్దులు వినరా నాగన్నా....





# లేగదూడ

రావే రావే నాతో ఆడా
మా యింటి మంచి లేగావుదూడా....

చెంగు చెంగునా కాళ్లెగరేసీ
ఖంగు ఖంగునా మువ్వా మోగా
మూతికి కట్టిన చిక్కం వూడా
మూపును తాకుతు తోకల్లాడా
గరికి పరకలను ఒకపరి కొరికీ
తిరిగి తిరిగి పరుగులెత్తుదూడా....
వచ్చే డడుగో పాలే రపుడే
వాడి కాళ్ళకీ అడ్డం వెళ్ళీ

వాడిని తాకీ అమ్మని నాకీ
తొందరగా చుట్టూ పరుగెత్తీ
గంగడోలు కడ ముట్టె పొడుస్తూ
అంగవేసి పొదుగుకుడుచు దూడా...

ముట్టెను అంటిన పాలనురుగుతో
ముంగిట నాతో మురిపాలాడవె
రానికొమ్ములా నుదుటిని నాపై
రంయి రంయిమని పొడువగరావే
బోసినోటిలో చవులూరంగా
బొట్టన వ్రేలును కుడిచే దూడా....

రావే రావే నాతో ఆడా
మాయింటి మంచి లేగావుదూడా....






క్వాక్వా క్వాక్వా క్వాక్వా క్వాక్వా

ఓహో బాబూ ఓహో పాపా
ఎక్కడి కెడుతున్నా రర్రా - అని
బళ్లో కెళ్ళే బాబుని పాపని
దార్లో ఒక బాతడిగింది....
క్వాక్వా క్వాక్వా క్వాక్వా క్వాక్వా

పాఠం చెప్పే పంతులు గారికి
పళ్ళియడానికి వెడుతున్నా మని
బాతుభాషలో పాపంటే విని
బాబు పకాలున నవ్వాడు....

చిట్టిచేతిలో పళ్ళుపుచ్చుకొని
పొట్టికాళ్ళతో గున గున ఊగుతు
బాతుల్లాగే పోతున్నారే
నాతో నేస్తం కడతారా అని
బళ్లోకెళ్ళే బాబుని పాపని
దార్లో ఆ బాతడిగింది...
నేస్తం నీతో కడితే మాకే
మిస్తావో చెపుతావా బాతూ...
క్వా క్వా క్వా క్వా క్వా క్వా క్వా క్వా

క్వా క్వా క్వా క్వా క్వా క్వా అంటూ
బాతుభాషలో పాపంటే విని బాబు పకాలున నవ్వాడు...

బళ్లో కెడుతూ నేస్తం కడితే
దార్లో సాయం వస్తానర్రా
చెర్లో తామర లిస్తా నర్రా
బళ్లో పంతులు కివ్వండంటూ
బళ్లో కెళ్ళే బాబుని పాపని
దార్లో ఆ బాతడిగింది....

క్వాక్వా అంటుందేమిటి బాతూ
అక్కా అని బాబడిగా డప్పుడు
క్వాక్వా అంటే గమత్తు కాదూ
చక్కని బాతు భాషరా అదీ...

క్వాక్వాక్వాక్వా క్వాక్వాక్వాక్వా
క్వాక్వాక్వాక్వా క్వాక్వాక్వాక్వా

బాతు భాష అని పాపంటే విని
బాబు పకాలున నవ్వాడు
బర్లోకెళ్ళే బాబూ పాపా
బాతూ నేస్తం కట్టారు....






రావోయి చందమామా మా మేడపైకి
రావోయి చందమామా....

ఆడుదామోయి చందమామా
ఎంచక్క - ఆడుదామోయి చందమామా
వెన్నేలా యేటిలోన కన్నూలా పండువైన
ఎన్నో మంచీ చుక్కల సన్నా ముత్యాలమాల
తేవోయి చందమామా మా మేడపైకి
రావోయి చందమామా....

దేవాలోకంలోనీ పూవూలా తేనెల్లు
కొండామీదీ మంచీ వెండీ గిన్నేలోన
తేవోయి చందమామా మా మేడపైకి
రావోయి చందమామా....




పిల్లలు : మా జేజీ మామయ్యా
రోజూ ఒక వేషమా.... ||మా జేజీ||

అమావాస్య నాడైతే
అసలే కనిపించవూ,
ఆ మర్నాడైనా అస
లవుపడతావో లేదో.... ||మా జేజీ||

శుద్ధ విదియనాడు నిన్ను
చూస్తే పుణ్యం కాదూ,
అందమైన నీకిస్తా
రందరు దండా లపుడు.... ||మాజేజీ||

వినాయకుడి చవితినాడు
వెర్రి నవ్వు నవ్వావట
అందుకు నినుచూసేవా
రందరి కవుతుంది శిక్ష ||మా జేజీ||

శుక్లపక్షమందు చూడ
చూడ పెద్ద వాడ వౌదు
పందు పున్నమైన నాడు
నిండు చందురుడ వౌతావ్.... ||మా జేజీ||

మామయ్యా జేజిమామయ్యా
మమ్మెరుగవా చందమామయ్యా ||మామయ్యా||

మేమంతా నీ మేనల్లుళ్లం
మేనకోడళ్లం కామయ్యా.... ||మామయ్యా||

మా అమ్మ చెప్పే కథలల్లో
మా నాన్న పాడే పాటల్లో
ఎన్నిసార్లు వచ్చి నావయ్యా-మాతో
ఎన్ని ఆటలాడినావయ్యా.... ||మామయ్యా||

నూలూవడికే ముసలి అవ్వయో
తేలీ గెంతే లేడీ పిల్లయో
మామా నీలో మచ్చరహస్యం
ఏమో మాతో ఎరుగ చెప్పవా.... ||మామయ్యా||

తెలి తెలి వెన్నెల యిస్తావు
కలకల మము నవ్విస్తావు
చుక్కలతో ఆడుకుంటావే
సూర్యుడొస్తే తెల్లపోతావే.... ||మామయ్యా||

జేజిమామయ్య : రండోయి నా మేనల్లుళ్లూ
రండమ్మ నామేనకోడళ్లూ...! ||రండోయి||

చుక్కలన్నీ కూడ సూర్యుళ్లే
సూర్యుడుకూడా ఒక చుక్కే!
నేనూ భూమీ సూర్యుడుకూడా
నింగిని తేలే గోళాలం!
పాలవెల్లిలో పన్నెండురాసుల
తేలే చుక్కలూ గోళాలే.... ||రండోయి||

సూర్యుడిచ్చే వేడి యెండంతా
నాపైని పడి వెన్నెలౌతుంది
సూర్యుడిచ్చే పగటి వెల్తుర్లో
నావెలుగు వెలవెలా పోతుంది. ||రండోయి||

భూమిచుట్టూ నేను తిరుగంగా
భూమి సూర్యుడి చుట్టు తిరుగంగా
రాత్రింబగళ్లూ, తిథులూ, పక్షాలు
నెలలు సంవత్సరాలవుతాయి...!! ||రండోయి||

నాలో ఉండే నల్లని మచ్చలు
కొండబిలాలూ గుహలేకాని,
అవ్వయు లేదు, లేడియు కాదు,
అవి అన్నీ కథలేకాని!!..... ||రండోయి||






ఆకాశంలో గాలీపడగా
అందంగా యెగిరే ఓ పడగా.... ||ఆకా||

తెలుపూ పసుపూ ఎరుపూ నీలం
కలకల లాడే రంగుల పడగా
పైకీ కిందికి పక్కల కూగుతు
బారుగ తేలీ ఆడే పడగా... ||ఆకా||

కుచ్చులు కట్టిన అమ్మాయిజడలా
ముచ్చటగా ఊగాడే తోకా
భాగవతంలో భామముఖంలా
అవునవు నన్నట్లాడే పడగా.... ||ఆకా||

నడుమ బొడ్డులో కట్టిన దారం
పొడవై సాగగపైకి వదులుతూ
గాలి కెదురుగ పరుగులు పెట్టుతు
బాలుడు తలెత్తి చూసే పడగా.... ||ఆకా||




చెట్టుకొట్టగా పాలుకారగా
నిన్ను కొట్టగా నీరుకారగా
చెన్నాపట్నం దుర్రుచ్చి, దుర్రుచ్చి, దుర్రుచ్చి....

మట్టికొట్టగా దుమ్మురేగగా
నిన్నుకొట్టగా నేయి కారగా
విశాఖపట్నం వెర్రొచ్చి, వెర్రొచ్చి, వెర్రొచ్చి....

కొమ్మ కొయ్యంగా పలక తేరగా
నిన్ను కొయ్యగా నిగ్గుతేరగా
కలింగపట్నం కిర్రుచ్చి, కిర్రుచ్చి, కిర్రుచ్చి....

పుట్టి తొయ్యగా గట్టుచేరగా
నిన్ను తొయ్యగా ఊరుచేరగా
మచిలీపట్నం రేవొచ్చి, రేవొచ్చి, రేవొచ్చి...

చెట్టుకొట్టగా పాలుకారగా
నిన్ను కొట్టగా నీరుకారగా
చెన్నాపట్నం దుర్రుచ్చి, దుర్రుచ్చి, దుర్రుచ్చి...



# వంకరటింకర శో

వంకర టింకర సో వోవోవో
వానీ తమ్ముడు ఆఆ ఆఆ
నల్లాగుడ్లా మీయా యీయీ
నాలుగుకాళ్లా మేయే యేయే.... ||వంక||

పప్పూసరుకుల తిండీ హెచ్చీ
పిప్పలి బస్తా కడుపూ నొచ్చీ
కొంకరపోయీ నాలుక వుంటే
కొరుకుమ్మతింటే చురుక్కుమంటూ.... ||వంక||

మాటల్లోనూ ఘాటునుచేర్చీ
మందపు ఆకలి మాపే శొంఠీ
భావంలోనూ కారం కూర్చీ
నోరూరించే తల్లే అల్లం.... ||వంక||

తుబుక్కు తుమ్మే జలదోషంలో
కంటా ముక్కూ జడివానల్లో
గొంతూ సుంతా పెగలక పోతే
నసాళమంటే మసాళ మిరియం.... ||వంక||

నవ్వూ రాకా ఏడుపు రాకా
నాలుగు దిక్కుల చూపులు పోకా
గిలిగింతలకే కదలని డొక్కా
కలిగిన మనిషీ మెమ్మె మ్మే కా.... ||వంక||



# జిలిబిలి



పలుకు మెలికలో జిలిబిలి జిలిబిలి
జిలిబిలి జిలిబిలి - జిలిబిలి జిలిబిలి
భావములో చక్కిలిగిలి గిలి గిలి
గిలి గిలి గిలి గిలి - గిలి గిలి గిలి గిలి....

మనిషి నడతలో కకవిక కకవిక
కకవిక కకవిక కకవిక కకవిక
మందిగుంపులో పక పక పక పక
పక పక పక పక - పక పక పక పక.....

నాట్య సరణిలో తక తక తక తక
తక తక తక తక - తక తక తక తక
అడుగుజారితే బెక బెక బెక బెక
బెక బెక బెక బెక బెక బెక బెక బెక....



# డీడిక్కు

డీ డీ డీ డీ డీడిక్కు
డీకా డీకా వేడెక్కు ||డీ||

పాపబుఱ్ఱా, నాన్న బుఱ్ఱా
డీ కొంటున్నా యెల్లాగఱ్ఱా
పాముబుఱ్ఱా మంచిబుఱ్ఱా
ఎవ్వరయినా చెప్పండఱ్ఱా ||డీ||

పాపబుఱ్ఱా మంచి బుఱ్ఱా
నాన్నబుఱ్ఱా పాముబుఱ్ఱా
మంచిబుఱ్ఱా మేడెక్కు
పాముబుఱ్ఱా తాడెక్కు ||డీ||

పిల్లిబుఱ్ఱా పిట్టబుఱ్ఱా
డీకొంటున్నా యెల్లాగఱ్ఱా
పిచ్చి బుఱ్ఱా మంచి బుఱ్ఱా
ఎవ్వరయినా చెప్పండఱ్ఱా ||డీ||

పిట్టబుఱ్ఱా మంచిబుఱ్ఱా
పిల్లిబుఱ్ఱా పిచ్చి బుఱ్ఱా
మంచిబుఱ్ఱా గూడెక్కు
పిచ్చిబుఱ్ఱా గోడెక్కు ||డీ||

# ఆట విడుపు



రారె చిన్ని పిల్లలార
రారె చిట్టి తల్లులార
ఆట పాట లెన్నొ కూడి
ఆడి పాడుదాముగా... రారె....

దాచుకోండి పుస్తకాల్
పాఠములిక చాలుచాల్
చేయి చేయి కలిపి చెంగు
చెంగున పరుగెత్తి రారె....

కొండమీద చందమామ
వెండిగిన్నె తేలునే
చద్దిబువ్వలోకి వెన్న
ముద్దలెన్నొ రాలునే....

అక్క మనకు తల్లిగాక
అందరమూ ఒకటికాగ
చల్లనైన వెన్నెలందు
తెల్లవారు లాడగా....

ఇంట నుండనేల - ఇటు
వంటి సంజవేళ - విహ
రింపగ రావేల - రావేలా...

చక్కని మైదానాల-చల
చల్లగాలి ఊల - మెల
మెల్ల పాడేవేళ - రావేల

మరుసంజ వెల్గు చాల
చెక్కూ టద్దాల పోల
చిరునవ్వు నవ్వేవేళ....

అందాల నేలు పూల
గందంపు పొడులురాల
కమ్మాదనాల తేల రావేల

ఇంటనుండనేల - ఇటు
వంటి సంజవేళ - విహ
రింపగ రావేల - రావేల




గాలిబంతి ఒహో గాలిబంతి
గాలిలో పైపైకి తేలుబంతి, నేల
తూలుబంతి, వాలుగాలిబంతి ||గాలి||

పరువులెత్తే పసితనంపు కాంతి
పసిమిలో మిసిమిలో మసలుశాంతి ||గాలి||

ఎగురనీ పైపైకి ఎగురనీ
ఎగిరి ఎగిరే బంతి ఈరేడులోకాలు
తిరుగనీ చకచకా తిరుగనీ
ఎరుగనీ విరివిగా ఎరుగనీ
తిరిగి తిరిగే బంతి మరుగుసంగతులెల్ల
ఎరుగనీ విరివిగా ఎరుగనీ ||గాలి||

తూలనీ గగనాన తేలనీ
తూలితేలుతు మేఘమాలికలు తాకనీ
తూలనీ గగనాన తేలనీ
తేలనీ భువిపైని వాలనీ ||గాలి||

పరువులెత్తే పసితనంపు కాంతి
పసిమిలో మిసిమిలో మసులుశాంతి
గాలిబంతి ఒహో గాలిబంతి
గాలిలో పైపైకి తేలుబంతి....





# సీతాకోక చిలుక

సీతాకోక చిలుకా ఓ
సీతాకోక చిలుకా

పచ్చని రేకుల పూసెజ్జ పయిని
మెచ్చగు రంగుల రెక్కల చిలుకా
నిద్దుర ఊయల నూగుదువో
నిద్దపు తేనెలు త్రాగుదువో... ||సీతా||

కమ్మ తెమ్మరలు జుమ్మని నీ రొద
కలసి పారగా చెలగును నా యెద
మా పెరటిలోని పూవుల తోట
కమ్మదనమ్ముల బరువగు మూట
కానుక నిత్తుము మానక రమ్మోయ్
కన్నుల పండువ సేయగ రమ్మోయ్... ||సీతా||



# పల్లకీ పాట

ఓం ఓహోహో ఓం ఓహోహో ఓం
ఓం ఓహోహో ఓం ఓహోహో ఓం!!

తర్లీ వెళ్లే పెళ్లికొమారుని పల్లకియా
పెళ్లి కొమారిత సవారియా... ||ఓం||

అత్తింటికి చను కొత్తకోడలి సవారియా
పుత్తడి పూవుల పోహళించిన సవారియా.... ||ఓం||

ముత్యాల పల్లకి మేనా సవారీ ఆగవే
బోయీల పాటల హాయిగ తేలుచు సాగవే ||ఓం||

ఓం ఓహోహో ఓం ఓహోహో ఓం
ఓం ఓహోహో ఓం ఓహోహో ||ఓం||




కొండమీది సూరీడూ - నీకూ
కోటి కోటి దండాలయ్యా.... ||కొండ||

ఏడురంగు గుర్రాలు పూన్చిన
ఇంద్ర ధనువు రథమెక్కు తావట
ఆకస మంతా వెలుగు లొలుకుతూ
అలసట లేకె తిరుగుతావట... ||కొండ||

ఎండ కాసినావంటే మొక్కలు
మండలు మండలు చివురిస్తాయట
ఎండ కాయకుంటే మాతోటలు
ఎండీ తలలూ వాలుస్తాయట... ||కొండ||

నిన్ను చుట్టి భూదేవి తిరుగును
తన్ను చుట్టి జాబిల్లి తిరుగును
వెన్నెల చీకటి వర్షం పంటలు
అన్నీ నీ వెలుగువల్ల కలుగును... ||కొండ||

పొద్దుట కాగా నిద్దర లేపీ
పగటి వెలుగులో పనులకు పంపీ
సాయంకాలము చలువను నింపీ
ఏలుదువట ఏ వేళను మమ్మూ.... ||కొండ||






# గడియారం దినచర్య

టిక్ టిక్ టిక్ టిక్ - టిక్ టిక్ మంటూ
క్షణ క్షణానికి ఊగును బిళ్ల
అరవై క్షణాలు అయ్యేసరికి

ఒక నిమిషం అయిపోయిందంటూ
ఒక్క చుక్క దాటు పెద్దముల్లు...

అరవై నిమిషాలయ్యే సరికి
ఒక్కగంట అయిపోయిందంటూ

ఒక్క అంకె దాటు చిన్న ముల్లు...

పెద్ద ముల్లు దాటి నాల్గు చుక్కలు
అయిదో చుక్కకు వచ్చే సరికి
అయిదు నిమిషములు అవుతా యపుడు

ఒకటి దగ్గరగ అయిదు నిమిషములు
రెండుదగ్గరగ పదినిమిషాలూ
మూడుకు దగ్గర పదిహేనూ
నాల్గుకు దగ్గర ఇరవయ్యీ
అయిదుకు దగ్గర ఇరవై ఐదూ
ఆరుకు దగ్గర ముప్పయ్యీ
అరగంటప్పుడు కొడుతుంది.

ఏడు దగ్గరగ ముప్పయి అయిదూ
ఎనిమిది దగ్గర నలభయ్యీ
తొమ్మిది దగ్గర నలభయి అయిదూ
పది దగ్గరగా యాభయ్యీ
పదకొండుకు యాభయి అయిదూ
పన్నెండుకు అరవై నిమిషాలూ....

పెద్ద ముల్లు పన్నెండు దగ్గరై
చిన్నముల్లు ఏ అంకెకు దగ్గర
చేరి వుండునో అన్ని గంటలు....

## - దినచర్య -

ఉదయం లేవడమయిదు గంటలకు
జేజికి దండం ఆరుగంటలకు
బడికి వెళ్లడం ఏడుగంటలకు
తిరిగి రావడం పది గంటలకు
నాన్న కచేరీ పదిగంటలకు
మా భోజనమూ పదిగంటలకే....
రెండు గంటలకు మళ్ళీ బడికి
ఆట విడుపు నాలుగు గంటలకు
ఇంటికి రావడ మయిదు గంటలకు
ఇంటిలో చదువు ఆరుగంటలకు
రాత్రిభోజనం ఏడు గంటలకు
తాతయ కథలూ పాటా పద్యం
ఎనిమిద నుండి తొమ్మిది వరకూ
తొమ్మిదో గంటకు జేజికి దండం
నెమ్మదిగా యిక నిద్రపోవడం...

# ఉగాది



మళ్లీ వచ్చింది కాదా, ఇదిగో ఇంకో ఉగాది...

తిరిగీ పూసింది వేపా
విరగా కాసింది మావీ
చివురూ కొమ్మావి ఊయలా
చివరా పాడింది కోయిలా....

రాశిగ వేప్పువ్వు పోసీ
చెరకూ ముక్కల్లు కోసీ
ముచ్చట రుచులారచేరగ
పచ్చడితో నోళులూరగ...

పోయిన యేడాది లోన
చేయని ఘనమైన పనులు
ఈ ఏ డెంతైన ఆశతో
సాధించాలన్న జిగీషతో....

ఏటేట ఉగాది నాటి
పాటలతో మాటలివేట
మాటలలో పరుగు లవెన్నో
చేతల నేరవేరు కొన్నే....

మళ్ళీ వచ్చింది కాదా, ఇదిగో ఇంకో ఉగాది...



# బొమ్మల కొలువు

కొలువూ పేరంటానికి రారమ్మా
మా ఇంట్లో బొమ్మల కొలువూ,
పేరంటానికి రారమ్మా....

అట్ట బొమ్మలూ మట్టిబొమ్మలూ
ముచ్చిచేసిన లక్క బొమ్మలూ
అందమైన పింగాణి బొమ్మలూ
రంగు రంగులా గాజు బొమ్మలూ
కొయ్యబొమ్మలూ దంతపు బొమ్మలు
కంచుబొమ్మలూ గందపు బొమ్మలు
ఏటి కొప్పాక నాటు బొమ్మలూ
కొండపల్లిలో కొత్తబొమ్మలూ ||కొలు||

కొండలు నదులూ జలపాతాలూ
కోటలు పేటలు వంతెన బాటలు,

మెయిళ్లుపోయే రయిలుదారులూ
ఏరోడ్రోములు గాలివిమానాల్
పట్నవాసములు పల్లెగూడెములు
పోలీస్ ఠాణా తాలింఖానా
పొలాలు, తోటలు, హోటళ్లు పార్కులు
రక రకాల మనుషుల బొమ్మలతో ||కొలు||

ఆటలు ఆడుకొనే స్టేడియమూ
నాటక శాలా సినిమాహాలూ
చిత్రవస్తువుల మ్యూజియమ్ములూ
చేపలతొట్టెలు జంతువనములూ
బజారులూ అంగడులూ బడులూ
దేవుడి గుడి దేవుడి కోనేరు
కొలువూ పేరంటానికి రారమ్మా
మా యింట్లో బొమ్మల
కొలువూ పేరంటానికి రారమ్మా....



# శ్రావణ మాసం



శ్రావణమాసం వచ్చిందీ
సంతస మెంతో హెచ్చిందీ
మెండుగ వారం వారం మనకీ
పండుగ లెన్నో యిచ్చింది... ||శ్రా||

పిల్లల బడులను తెరిచారు
అల్లరి యిండ్లలో మరిచారు
కొత్తపుస్తకాల్ కొన్నారు
కొత్త పాఠములు విన్నారు.... ||శ్రా||

అదునుకు వానలు కురిశాయి
పదునయి గింజలు తడిశాయి
చూపున మొలకలు తోచాయి
ఏపుగ చేలూ లేచాయి... ||శ్రా||

మంచిము త్తెముల హారాలు
తోరణాలు గల ద్వారాలు
పసపు గుంకుమల వదనాలు
ఎసగే లక్ష్మీ సదనాలు... ||శ్రా||



# చలి చలి చామక్కా

చలిచలి చలిచలి చామక్క
కుంపటితేవే గురవక్క
పొలి పొలి పొలి పొలిగాడా
గంపలు నింపర గురవయ్యా

పిట్టల కెగరెయ్ పిడికిళ్లు
బిచ్చగాళ్లకెయ్ దోసిళ్లు
కుప్పల నూర్చిన ధాన్యాలు
రాసులుపోయర రంగయ్యా

కితకిత కితకిత కిష్టయ్యా
గంతులు వేయకు రాధక్కా
దులపవే పావడ కుచ్చెళ్లు
చలి మంటల్లో గొబ్బిళ్లూ

చురుకు రక్తపూ పరుగుల్లో
చుట్టూ మూగిన మనవల్లు
తాత చుట్ట పొగ సుడులల్లో
కంబళిముసుగున కథలల్లు

చలి చలి చలి చలి చామక్కా
కుంపటి తేవే గురవక్కా



# రోలు - మద్దిల

రోలు : ఓహో మద్దిలయ్య
ఓ మద్దిలయ్య విన్నావయ్యా
అహోరాత్రములందు
నా బాధ సుంత విన్నావయ్యా
సువ్వి సువ్వి....

మద్దిల : ఓ రోల ఓ బేల విన్నానులే నీదు గోల
నా బాధ నీ కేమి తెలుసులే వెర్రి గోల
ఓ బేల ఓ రోల....

రోలు : వడ్లూ దంచీతేనూ
గుడ్లూ మిటకారిస్తా మద్దిలా
పప్పూ దంచీతేనూ
పక్కా లదురూతాయీ మద్దిలా... సువ్వి

పసుపూ దంచీతేనూ

పరవళ్లూ దొక్కూతా మద్దిలా,

ఊకా దంచీతేనూ

శోకామే నాపని మద్దిలా... సువ్వి

మద్దిల : ఒక పక్క దంపుడే నీకు,

ఇరుపక్కల బాదుడు నాకు

నా బాధ నీకేమి తెలుసులే

వెర్రీగోల ఓ బేల ఓ రోల....

తకధిమి తకఝుణు తళాంగుతజ్జణు

తడికుడిడికు ద్రిగుడు తళాంగుతోం

ధిమితధిమిత ఝుం ఝుధింధిం ధిమిత

తఝుం తధిం తళాంగుమంటూ యిరు

పక్కల బాదుడు నాకు, ఒక

పక్క దంపుడే నీకు, నా

బాధ నీకేమి తెలుసులే

వెర్రిగోల, ఓ బేల ఓ రోల....

రోలు : తెలకాపిండీ దంపా

ఉలికులికీ పడతా నో మద్దిలా

ఉలవల్లు దంచితే

కళవళ పడతా నో మద్దిలా

పొట్టూ దంచితేను
బోర్లాపడతా నో మద్దిలా
చిట్టూ దంచితేను
చిడిముడి పడతా నో మద్దిలా
అడ్డామైనవి దంపీ
హైరాణ పెడతారు మద్దిలా సువ్వి

మద్దిల : గ్రామాల్లో, గుడిమేళాల్లో, గుడి
లో, హరికథ తాళాల్లో రా
మ భజన సమ్మేళాల్లో
గానసభల్లో, రాష్ట్ర సభల్లో

రాజధానిలో రచ్చ సభలో
ద్రిగుడ్త ద్రిగుడ్త ద్రిగుడ్త ద్రిగుడ్త తరికిట
తళాంగుతోం తళాంగుతోం తోం తక
ధిత్తళాంగు ధిమితోంత
ద్రిగుడు ధిత్తళాంగు ద్రిగుడు ధింత

ఒకపక్క దంపుడే నీకు
ఇరుపక్కల బాదుడు నాకు
నా బాధ నీకేమి తెలుసులే
వెర్రిగోలా ఓ బేలా, ఓ రోలా....

# పిల్లల లోకం



పిల్లలలోకం పిల్లల లోకం
గట్టిపడని లే చక్కెర పాకం
మెత్తమెత్తగా వెచ్చ వెచ్చగా
కొత్త కొత్తగా గుజ్జు గుజ్జుగా
చేతికి మూతికి, చెంపకు గుండెకు
లేత లేతగా అంటే పాకం!

నలుపలకల చిట్టి పైసలాంటివి
పలుమెలికల పదిపైసలలాంటివి
ఆఠీన్, డైమన్, కళావర్, ఇస్పేట్
అందమౌ పేక చుక్కలలాంటివి,
పెద్దవి చిన్నవి పిప్పరమెంట్లు
రంగురంగుల పిప్పరమెంట్లు–!
మిసమిసలాడే బుగ్గల
మీగడతో మెదిపినవి,
కోరికలూరే కమ్మని

కోకో తో కలిపినవి
బాదం, పిస్తా, కాజూ
పల్లీలూ పొదిగినవి
ఆరారా తినాలని
నోరూరే చోకొలెట్లు!
పిప్పరమెంట్లు, చోకొలెట్లు
తయారయేలోకం!
ఇది పిల్లలలోకం!

గణగణమని గంట మ్రోగ
కలకల కేరింతలతో
పరుగులెత్తు లోకం!
చరచర చక్రం తిప్పగ
గిర గిర మని గిన్నెలోని
తియ్యనైన పాకం
తెరతెరలై పొరపొరలై
తిరిగి తిరిగి పైకి లేచు
ఎరుపురంగు దూదిలాంటి
ఎంచక్కటి మేఘం!
దూదిలోని పోచల్లా
మబ్బులోని ధారల్లా
తీరితీరి చేరిచేరి

పైకి లేచు పీ చంతా
పైకి తీసి ఉండచుట్టి
నోట పెట్టినంతలోనె
ఊటఊరి కరిగిపోవు
పీచుమిఠాయ్ పాకం
పాపాయిల లోకం!

అమ్మ, నాన్నా అసలు కూర్చి
అన్నలూ అక్కలూ తీర్చి
ఆవలీవలి నేస్తగాళ్లు
ఆటపాటల కొంత మార్చి
బడులలో పంతుళ్లూ చెప్పే
చదువుసాముల కొంత నేర్చు
రోజురోజుకు గడియగడియకు
రూపుతేలే చందమామ
అమృతమ్ము కురిసేటి పాకం
అందాలు చిందేటి లోకం
పిల్లలలోకం, పిల్లల లోకం!

# ఉడతా ఉడతా

ఉడతా ఉడతా హూత్
పిడతాకిందీ శలగా పప్పూ
పెడతాపెడతా రావే రావే ||ఉడతా||
మిడుతూ మిడుతూ మంటూ చూస్తూ
పడుతూలేస్తూ, పాకీదుమికీ
కొబ్బరిమట్టా కొసనూకూచుని
కొరికేదేంపిందే ఉడతా ||ఉడతా||
కుచ్చూతోకను చేర్లబడుతూ
కూచుని వెనక కాళ్ల పై కుదురుగ
ముంజేతుల్లో కొబ్బరి పుచ్చే
ఎంచక్కా తింటావే ఉడతా ||ఉడతా||
చొచ్చో చొచ్చో చొచ్చో అంటూ
గోడలు చెట్లూ మేడలు మిద్దెలు
నిచ్చెన లేకే ఎక్కేస్తూనే
ఏంవెదుకుతావే ఉడతా ||ఉడతా||
పరపరపిందే కొరికీవేసీ
తొరతొరగానూ మింగీ మీసాల్
వెనక్కితోసీ ముందుపళ్లతో
వెకిలినవ్వు నవుతావే ఉడతా ||ఉడతా||

# తేనెటీగలపాట

జుంజుమ్మూ రొదల తుమ్మెదలారా!
పెన్‌జెట్ల తేనెటీగల్లారా!
ఎగరండి దండు దండులుగా
ఆడండి రండి పాడండి! ||జుంజుమ్మూ||

అదుగదుగో ఆపక్క పూదోట
గుదిగుదులుగా పూలగుత్తులతో
రంగయిన మేలు పుప్పొడులతో
పొంగారు తేనె గూనలతో ||జుంజుమ్మూ||

చెదరునల్లపూసల దండలై
అదరు రెక్కలరిచే రొదలతో
పువురెమ్మ రెమ్మ కొమ్మలపైనీ
రివురివ్వురివ్వు రెక్కలదరగా ||జుంజుమ్మూ||

రాపాడు ఉల్లిపొర రెక్కలతో
పైపైకి కిందికీ పక్కలకీ
ఎగిరెగిరినాట్యాలు చేదామా
పూదోట వాటేయ పోదామా ||జుంజుమ్మూ||

మైనమ్ము పోగులుగ పెడదామా
రాణీకి కోటనే కడదామా
గుదులుగా గూళ్లూ పేరుద్దామా
గదులలో తేనె చేరుద్దామా ||జుంజుమ్మూ||

# సీతాకోకచిలుక

ఆకు చిలుకవో సీతా
కోక చిలుకవో చెపుతావా ||ఆకు||
మిలమిలమను పూరేకుల సరసనే
తళతళమని నీ రెక్కలు మెరిసె ||ఆకు||
రెపరెపలాడే నీ రెక్కలు
ఎప్పుడు చటుక్కున ఆపేవో
ఎప్పుడు పువ్వులు పరచిన కొమ్మపై
చప్పుడు చెయ్యకే వాలేవో ||ఆకు||
పంగచాపి నిలిపిన రెక్కల కవ
రంగుపట్టు జలతారు దువ్వలువ
సీతకోకా అది నీరైకా
పచ్చనాకుల జంట పతాకా ||ఆకు||



# పంది

బురదలోని పంది, బా
బుని చూసేమంది!
బాబూ యిటురావా, నాతో
నేస్తం కడతావా!
పందిని చూసి బాబూ - ఇ
చ్చాడిలా జవాబు!

"నీతో నాకేం నెయ్యం? బుర
దంటే నాకసయ్యం!!
గురుగురుమంటావు, చూసిం
దల్లా తింటావు!
పందీ పోపోవె, నీతో
నేస్తం కట్టను లేవే"!
బాబును చూసి పంది, ఆ
ప్పుడు ఇలాగ అంది!
"పడమటి దేశాలందు, విడి
విడి గదులందుందు!
మరి మనదేశాన నా

కిదేబతుకుకాన,
నా పాపలచూడు, నీ
కిష్టమైతే ఆడు!"
పంది కపుడు బాబు, ఇ
చ్చాడిలా జవాబు!
"గునగునపరుగెత్తునీ
కూనలంటే ముద్దు;
మురికి తనం పొత్తూ నా
కేమాత్రం వద్దు".



# మామిడి

చిమ్మన క్రోవిలా రసం చిమ్ము తియ్యమామిడి!
పుల్లదనాలూ, తీపులు, కొల్లగ చల్లే మామిడి!!

రెండు చేతులందైనా నిండదు అరచేతనైన
పండుముచిక గిల్లి జీడిపిండగ అమృతాలూరే!!

కోయిల కూతకు తీయన పూయు దివ్యరసాయనం
కెంపు చివురు కిసాలం ||చిమ్మన||
మాయని మనుజుల మమతకు
తీయని దగు ఉపాయనం!
రసాలు చిలుకు రసాలం ||చిమ్మన||

చెరకూ వేపల ఉగాది చేర్చిన పచ్చడి మామిడి
బ్రెడ్ కోసిన చెక్కల రుచి పెంచే కెచ్చప్ మామిడి
బెత్తులుగా తాటి చేదర ఒత్తినతాండ్రల మామిడి
ఊరగాయతో ఎండలజోరు మరిపించే మామిడి ||చిమ్మన||



# అడవి

ఆకులు ఆకులూ కలిస్తే, కొమ్మలు కొమ్మలూ మెరిస్తే
చెట్లూ చెట్లూ చెట్టపట్టగా, చేరి పెరుగు దట్టమైన అడవీ!!

చీమలు దూరని చిట్టడివీ, కాకులు వాలని కారడివీ
ఎండ చొరని కొండల అడవీ, జీబురుమను చీకట్లడివీ!!

నట్టడివిని బందీగా బాధపడే కట్టుకథల్లో రాకుమార్తెను
శత్రుల కూల్చీ, చెరవిడిపించీ, చేపట్టె రాకొమరుడిలాగా
తొలకరిమబ్బుల తొలివర్షాలను చల్లదనాలను జల్లు జలాలను
జలజల కురియించి, పచ్చదనాలను వెలయించే కొండలచిట్టడివి!!

సివంగి చిరుత లేన్గు లెనుబోతులు, ఒరాంగుటాంగులు గోరిల్లాలూ
తోడేళ్లూ నక్కలు, సింహాలూ, పులులు, ఖడ్గమృగాలు హిప్పోలూ
స్వేచ్ఛగ విహరించే అడవి!!



